## ఆంధ్రమహాసభ అధ్యక్షులవారి పర్యటన

(స్వకీయ విలేఖరి)

కొలనుపాక, వై రా

ఆంధ్రమహాసభాధ్యక్షులగు శ్రీయుత రావి నారాయణరెడ్డిగారు శ్రీ జి- గోపాల్ రెడ్డిగారిని వెంటనిడికొని ౬ నవైతీఉదయము హైద్రాబాదునుండి భువనగిరితాలూకాయందు పర్యటనగావించుటకై బయలుదేరి ఆలేరుకుఉదయము పదకొండుగంటలకుచేరిరి- ఆలేరునుండి యెడ్లబండిపై ఇక్కుర్తియను గ్రామమునకు అధ్యక్షులవారు ఆయట్ల రామచంద్రారెడ్డిగారితోను ఆయట్లకమలాదేవిగారితోను పగలురెండుగంటలవరకుచేరగలిగిరి, శ్రీకొమ్మిరెడ్డి, రాంరెడ్డిగారు స్థానికులతో ఊరువెలుపలికివచ్చి అధ్యక్షులవారికిస్వాగతమిచ్చి బసకుతీసికొనివెళ్ళిరి- తమకుగలఇబ్బందులను తెలుపుకొనిరి- అధ్యక్షులవారు వారిగిసమాధానపరచి నాలుగుగంటలవరకు విశ్రాంతిగైకొని గ్రామస్థులనువెంటగైకొని రబ్బీచేనులనుచూచిరి. పునాసనాలుగణాలపంట పండినదని శ్రీఅధ్యక్షులవారునిర్ణయించినారు. అబిమాడణాలపంట పండినదనియు గ్రామస్థులు చెప్పుకొనిరి- వర్షములులేకపోవుటచే ఆముదపుచేనులు కందిచేనులు వాడిపోవుచున్నవి- ఇదిజాగీరుగ్రామము. వేయిమందిజనసంఖ్యగలగ్రామమైనను ప్రజలు ౫౦౦౦ మాలుగుజారి చెల్లించుకొనుచున్నను జాగీర్దారుగారు ఒక్కపాఠశాలనైననుస్థాపించలేదు.

అధ్యక్షులవారిని దర్శించుకొనుటకై గ్రామస్థులు తండోపతండములుగవచ్చి, పుష్పమాలలువేసి తమకువారియెడగల భక్తివిశ్వాసములచూపుకొనిరి. అధ్యక్షులవారు ఆంధ్రమహాసభయొక్క ప్రాముఖ్యతను తెలిపి రాత్రిపాఠశాలను స్థాపించుకొనుటకైఉద్బోధించిరి- శ్రీమతికమలాదేవిగారు స్త్రీవిద్య, గృహకృత్యములపై మాట్లాడిరి- చిలుకూరుయందుజరిగిన ఆంధ్రమహాసభ ముఖ్యతీర్మానములపై శ్రీ-జి-గోపాల్ రెడ్డిగారు మాట్లాడిరి. రాత్రికి శబ్బీనాపురమను మరొకజాగీరుగ్రామమునకువెళ్లిరి-

8 వతై మంగళవారము వాడిపోవుచున్న రబ్బీపైరులను అధ్యక్షులవారుచూచి రైతులకుండు కష్టములనువిచారించుకొనిరి- మంతపురియను గ్రామమునకు కాలినడకతో పై కార్యకర్తలతో చేరిరి- రాత్రిఆరుగంటలనుండి వందలకొలదిగ్రామస్థులు అధ్యక్షులవారిని దర్శించుకొని పూలమాలలుఅర్పించుకొనిరి- ప్రజలయొక్క కష్టములను తెలిసికొని సలహాలొసంగిరి. శ్రీమతి కమలాదేవిగారు, శ్రీ జి-గోపాల్ రెడ్డిగారు, ఆయట్ల రామచంద్రారెడ్డిగారు. శ్రీకొమిరెడ్డి రాంరెడ్డిగారు వివిధసమస్యలపైముచ్చటించిరి- అధ్యక్షులవారు రాత్రిపాఠశాలనుదర్శించి ఉపాధ్యాయునికి విద్యార్థులకు తగుసూచనలిచ్చిరి.

౯ వతైనాడు బహద్దరుపేటయను మరొకజాగీరుగ్రామమునకు యెడ్లబండిపై అధ్యక్షులవారువచ్చి అచ్చటరాత్రిపాఠశాలస్థాపించి రైతులకుగల కష్టములనుతెలిసికొని వాటినివారణోపాయములనుసూచించిరి. బుధవారము సాయంత్రము అధ్యక్షులవారు కొలనుపాకనుచేరిరి. శ్రీయుతఆరుట్లలక్ష్మీనారసింహారెడ్డిగారియింట్లోదిగిరి. కొలనుపాక జాగీరుపోలీసుచే జప్తుచేయబడిన బాలికాపాఠశాలభవనమును కొలనుపాక రాత్రిపాఠశాలను, బాలికాపాఠశాలనుచూచిరి, రాత్రిపాఠశాలకు తగుసహాయముచేతుమని శ్రీఅధ్యక్షులవారు వాగ్దానముగావించిరి. గ్రామప్రజలతో ఇష్టగోష్ఠిజరిపిరి- చుట్టుపట్లగ్రామాలనుండి గ్రామపెద్దలు కొలనుపాకకు అధ్యక్షులవారు దర్శించుకొనుతలంపుతోవచ్చిరి-శ్రీలక్ష్మీనారసింహారెడ్డిగారియింట్లోరాత్రిజరిగినసమావేశమందుపట్టీసంఘముయొక్కప్రాముఖ్యతను అధ్యక్షులవారు తెలిపి పట్టీసంఘముస్థాపించిరి-

## హిందీ భాషా ప్రచారము

(ఒకవిలేఖరి) గూడూరు-(మహబూబాబాద్ తాలూకా), వై ఇ.

౧౫-౨-౧౩౫౧ఫ. తేదీన ఈ గ్రామమున రెండుమాసములనుండి "శ్రీ తులసీరామాయణమును. హిందీ, సంస్కృత, ఉర్దూ తెనుగుభాషలలో రాగములతోను పఠికులకు అభివ్యక్తముచేయుచు, నేటిదివసమున "శ్రీ రామచంద్ర సామ్రాజ్య పట్టాభిషేకమహోత్సవమును. హిందీ సంస్కృత విద్వాంసులగు శ్రీమాఢ గోవర్ధనం నరసింహాచార్యులుగారు పురాణ కాలక్షేపమొనర్చిరి- వందలకొలదిజనులు గ్రామగ్రామాంతరములనుండివిచ్చేసిరి- శిబికవాహనమున శ్రీస్వామిగారినిఊరేగించిరి- పఠికులు తమయానందమును వాక్ప్రూపముగ నేకాక సువర్ణపతకయుక్త కంకణమును బహుమానముగానొసర్చి తమ జన్మమును సార్థకము గావించుకొనిరి.











## విషాదము

వృషనామసం॥ కార్తీక బ ౧ లు కోదాడు ఆర్యసమాజమందిరములో నిజాంరాష్ట్రీ ఆర్యప్రతినిధిప్రచారకులయిన భువనగిరిరామకృష్ణశాస్త్రిగారి ఆధ్యక్షతలో ఈక్రిందివిషాదప్రకటనతీర్మానం అంగీకరించడ మయినది.

"వృషనామసం॥ కార్తీకబ౧లుమంగళవారం నాడు స్థానిక ఆర్యసమాజవర్కింగుకమిటీ సభ్యుడయిన శ్రీమాఢ-రంగాగోపయ్య ఆర్యగారు దివంగతులయినందున వారిఆత్మకు శాంతి కలుగగ అందులకొరకు ప్రార్థనచేయుడమయినది" ఈసభకు దాదాపు యాభైమందిసభ్యులు విచ్చేసిరి.

[కోదాడుగ్రామం ఏయూలలోఉందో తెలుపవద్దా? గో. ప,]

## అనావృష్టి బాధ

(ఒకవిలేఖరి)

మహబూబునగరము జిల్లాలో నాగర్ కర్నూలు తాలూకాలోచేరిన యెలుగొండగ్రామములో ఈసం॥ పంటలులేక బీద జనులు క్షుద్బాధచే వాపోవుచున్నారు- పశువులకుకూడ నీరు బొత్తిగా దొరకుటలేదు.





## టప్పాఖాన కావలెను

(ఒ-వి) గుడిపల్లి, వై ౭

ఈగ్రామం తా॥ దేవరకొండలో చేరినది-ఈ గ్రామమునకు టప్పాఖాన దేవరకొండఆయియున్నది-ఈగ్రామమునకు దేవరకొండ సుమారు (౧౮) మైళ్ళదూరంకలదు. ఇంతకుపూర్వము మాగ్రామమునకు (౩)మైళ్ళ దూరముననున్న పాలువాయి అనేగ్రామములో టప్పావుండెను-కాని సర్కారువారు పాలువాయినుంచి టప్పాఖాన తీసివేసి దేవరకొండకు మార్చినారు-ఈగ్రామంలోని ఇండ్లు ౫౦౭, జనులు ౧౫౧౦కలరు- ఇక్కడి వ్యాపారము నల్లగొండ, దేవరకొండ, హైద్రాబాదు, ఖమ్మం, సదాశివపేట, మిర్యాలగూడెం నుంచికలదు. ఈగ్రామములో ప్రాథమికపాఠశాలకలదు. టప్పాసౌకర్యము లేనందువలన ఈ గ్రామవాసులకు చాలానష్టములు మరియుయిబ్బందులు కలుగుచున్నవి. ఇంతకుపూర్వము గ్రామవాసులకు చాలానష్టములు మరియు యిబ్బందులు కలుగుచున్నవి- ఇంతకుపూర్వము ఈగ్రామవాసులు సర్కారువారిలో రెండుమూడు విజ్ఞప్తులు పెట్టుకొనిరికాని దానిఫలితము నేటివరకునుగూడ లేదయ్యెను.

# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర మార్గశిరశు॥ ౨

గురువారము


# విద్యాపద్మవ్యూహము

౨

హైదరాబాదు రాష్ట్రములోని భాషలబాహుళ్యము, వాటిలోని "బేబెల్" తత్వము, అవిపద్మవ్యూహముగా ఏర్పడుటనుగురించి గతవ్యాసములో స్పృశించి విడిచియుంటిమి. మనరాష్ట్రములోని విద్యాసమస్య చాలాచిక్కులలో ఇరుకుకొనిపోయినది. భాషావాదము మతవాదమునకు లంకెఅయిపోయినది. నూటికి [illegible] హిందువులభాష ఉర్దూకాదు. [illegible] నూటికి [illegible]మందిచేత చదివించుటలోన తప్పకుండా ఇబ్బందులుకలుగుచున్నవి. ఉర్దూభాష మన మ- ఘ- వ- నిజాంప్రభువుగారి మాతృభాష. అది ప్రభుత్వభాషగా ఏర్పడింది. కచ్చేరీలలో పూర్తిగా ఉర్దూస్థిరపడింది. బళ్లలోను ఉర్దూకే సర్వాధికారమేర్పడింది. ఉర్దూవాఙ్మయమపారముగా వృద్ధిపొందినది. ప్రజలద్రవ్యము ఉర్దూవాఙ్మయానికి బాగావినియోగమైంది. కాని తెనుగు మరాటీ కన్నడభాషల సాహిత్యమునకే మాత్రమును వినియోగముకాలేదు. ఉర్దూకై తర్జుమాశాఖకలదు. ఏటేటవేలకొలది ఉర్దూసాంకేతికపదాలను ఒక్కొక్కపదానికి [illegible]అణాలవరకు వ్యయముచేసి సృష్టించుచున్నారు. ఈకారణాలచేత హిందువులలో చాలాఅసంతృప్తి వ్యక్తమగుచూవచ్చినది. తమమూలసంస్కృతికే యీఉర్దూవిధానము మూలచ్ఛేదమగుచున్నదని హిందువులు భయపడుచున్నారు. ఉర్దూభాషలో హిందువులకు చదువుచెప్పించితే హిందూసంస్కృతియెందుకు, ఎట్లుచెడిపోగలదు? అనియందురా? ప్రశ్నకుప్రతిప్రశ్న వేసితే సులభముగా మనసుకెక్కగలదు.

ఉర్దూ మాతృభాష కలవారికై ప్రాధాన్యముగా కన్నడములోనో తెనుగులోనో చదువుచెప్పించితే ఎట్లుండును! మైసూరులో కన్నడము ప్రధానభాష. అక్కడముసల్మానులు [illegible]లక్షలకుపైగా ఉన్నారు. వారికికన్నడవిద్యను నిర్బంధముచేయకుండా ప్రత్యేకముగా ఉర్దూపాఠశాలలెందుకేర్పాటుచేసినారు. బాలికలకుమాత్రమే ప్రత్యేకముగా ౫౦౦ ఉర్దూబళ్లనెందుకు స్థాపించినారు. ఉర్దూపర్యవేక్షకురాలిని (Inspectress) ఏల ఏర్పాటుచేసినారు! అట్లుండినను మైసూరుసంస్థాన ముసల్మానులు తమకుఉర్దూవిద్యకు తగినఏర్పాటులేదని ఎందుకు మొరపెట్టుకొనుచుందురు? మాతృభాషకుస్థానమియ్యక పరభాషలకే ప్రాధాన్యమిచ్చినచో జనులసంస్కృతికి చాలాభంగముకల్గునని ఉర్దూవాదులేఅనుచున్నారు. ఎవరనుచున్నారని ప్రశ్నింతురా? వినుడు!

ఉర్దూభాషాలోకములో మౌలానా అబ్దుల్‌హఖ్‌గారి కున్నస్థానముఇతరులకులేదనవచ్చును. వారుకొన్నిదినాలక్రిందట పత్రికలలో కాంగ్రెసువారును హిందీవాదులును ఉర్దూకుచేయుచున్న అపకారమునుగురించి తీవ్రముగా ఖండించిరి. వారువ్రాసిన అభిప్రాయములలో కొన్ని పాఠకుల జ్ఞాపకార్థ ముదహరించుచున్నాము. వారిట్లన్నారు.

"హిందూముస్లిం విభేదాలకు మూలము హిందీవాదమే... ఉర్దూ మాతృభాషకలవారు ఉర్దూను ఒకవిధముగాపవిత్రభాషగా భావించుచున్నారు—ఉర్దూకు ప్రాతికూల్యత చూపింపబడుచున్నదని వారు విన్నప్పుడు లేక చూచినప్పుడు లేక ఉర్దూను సమూలముగా తుడిచివేయ చూచుచున్నారని తెలిసినప్పుడు వారి హృదయాలలో ప్రాతికూల్యత, అసహ్యతయొక్క అగ్నిజ్వాల జాజ్వల్యమానముగా గసులుకొనుచున్నవి. ........ ఉర్దూను తుడిచివేయజూచుటఅంటే ఉర్దూమాట్లాడువారి సంస్కృతిని, ఉర్దూ మాట్లాడువారి ఉనికను తుడిచివేయు ప్రయత్నముగానుండును........ గాంధీజీ హిందీప్రచారానికి నడుముకట్టిననాటినుండి దేశమంతటను నిప్పంటుకొనిపోయెను. గాంధీగారు దేశముయొక్క ప్రబలశత్రువుకూడా చేయని అపకారమును హిందీని రాష్ట్రభాషగా చేయు ప్రయత్నమాలయున చేసినారు. ... ... భాషాసమస్య సామాన్యమైనదికాదు-దానిపైనచేయివేయుడం చాలా ప్రమాదకరమైనపని-ఎక్కడెక్కడ భాషలపైచేయివేసినారో అక్కడక్కడ ఫలితము లేకపోగా పైగా దాని వెనువెంటనే చాలా ఆపత్తులు, కష్టాలు, సంభవించినవి. ... చెప్పరానిదౌర్జన్యాలను దుఃఖాలను చూపినను, నోళ్ళనునొక్కివేసినను, జైళ్ళలో నిర్బంధించినను, శాసన సహాయముతో అణచివేసినను అధికారగమంసుందువారు తమకులోబడి బాధలనుపొందువారి భావను తుడిచివేయజాలకపోయిరి ........"

ఈఉదాహరణ భాగమును విపులముగా ఇచ్చియున్నాము. మౌలానా అబ్దుల్‌హఖ్‌గారి ప్రాముఖ్యతనుబట్టి వారిచ్చిన అభిప్రాయముల విలువనుబట్టి పాఠకులు పై వాక్యములలోని ప్రత్యక్షరమును మాటిమాటికిచదివి అందలి తీవ్రతనుగ్రహింతురుగాక. బ్రిటిషిండియాలో ఎక్కడెక్కడ ఉర్దూకు దానిసవతిబాసయగుహిందీవల్ల అపకారంజరిగిందో అచ్చటనంతయు ఆపద్ధతిచాలాగర్హింపదగినదే. పై మౌల్వీగారివాక్యాలు ఒకఉర్దూకుమాత్రమే వర్తించవు. వారుప్రపంచచరిత్రపై ఒక సింహావలోకనము చేసి అణచివేయబడినభాషలన్నింటిపక్షాన ఆవాక్యాలన్నువ్రాసినారు. మనరాష్ట్రములోనిభాషలకు పై వాక్యాలను అన్వయింపజేయవలెనంటే ఉర్దూఅనుపదమందుచోట తెనుగు మరాటీ కన్నడభాషలు అనుమాటలనుపెట్టి చదివితే ఎట్లుండును? అంతకఠినముగా ఎన్నడైనను పైభాషలను మాట్లాడువారు చెప్పియుండినట్లు కానరాదు. మొత్తము పైభాషకు సంస్కృతికిని—అంతేకాదు తుదకు—మతమునకు కూడా అవిచ్ఛిన్నావినాభావ సంబంధమున్నదని మౌల్వీఅబ్దుల్ హఖ్ గారొప్పుకొనియున్నారు.

ప్రభుత్వభాష ఉర్దూ అయియున్నది. అట్లయినంతమాత్రాననే విద్యావిధానమందు ఉర్దూను సర్వత్రనిర్బంధముగా చెప్పించుట సరికానేరదు. ఈసందర్భములో ఒకఅపోహమును తొలగింపవలసియున్నది- హిందువులుమాకు మామాతృభాషలో విద్యచెప్పించండియ్యా అని ఆందోళనపడితే దానికిజవాబుగా కొందరు ఉన్నతాధికారులును ముస్లింనాయకులును ఈవిధముగాపలుకుదురని ప్రతీతి— "మీరుఉర్దూను ఎందుకు ద్వేషించుచున్నారు. పరభాషయగు ఇంగ్లీషుకన్న మీకుఉర్దూ సోదరీభాషకాదా? ఎక్కువగా సన్నిహితత్వముకలదికాదా? కాంగ్రెసువారు సహితము హిందూస్థానీని సర్వదేశ వ్యావహారికభాషగా చేయబూనుచున్నారుకదా? మరిహిందూస్థానీకిని ఉర్దూకును ఏమంతభేదమున్నది. పైగామేమును కాంగ్రెసువారు బోధించే పనినే నిర్వహించుచున్నాముకదా. రాష్ట్రములో వివిధభాషలుండినప్పుడు వారుపరస్పరం వ్యవహరించుటకొకభాష అవసరముకదా! ఆయవసరాన్ని ఉర్దూ తీర్చుచున్నదికదా!" అనితర్కింతురు. చాలామంది ఇన్నికారణాలుచూపించి తర్కింతురోలేదోకాని మేముమాపక్షాననే ఈకారణాలన్నింటిని ఊహించుకొనియే వ్రాసినామనుకొనుడు. సహజముగా ఉర్దూవాదులు పైకారణాలనే ఉర్దూప్రచారానికై చూపించుటలో అర్థమున్నది. సమంజసత్వము ఉన్నది. ఈ కారణాలు చాలావరకు సవ్యముగానే కనబడుచున్నవి. పై ప్రశ్నలకు మేమీవిధముగా సమాధానమిచ్చుచున్నాము.

ఉర్దూను మాట్లాడనివారు ఉర్దూను ద్వేషించుటలేదు. అది అన్యాయమైన ఆరోపణము. స్వభాషాప్రేమించుట పరభాషాద్వేషమగునా? పైగా ముల్కీభాషలకు ఏఅధికారస్థానమున్నది. ఏయవలంబమున్నది. వాటికి స్థానములేనప్పుడు వాటినే ద్వేషించుటయగునా లేకఅవే ద్వేషించునవగునా? మౌల్వీఅబ్దుల్‌హఖ్ గారు తమఉర్దూను గాఢముగాప్రేమించినవారు హిందీనికాని యితరదేశభాషలనుకానీ ద్వేషించినవారగుదురా? ఇంగ్లీషు కన్నఉర్దూమాకు సన్నిహితమైనది. ఆకారణముచేతనేకాక ఇతరకారణాలచేతను దానికిమేము మామాతృభాషల తర్వాతరెండవదర్జాఇచ్చితప్పకప్రేమించువారము. అదేవిధమైన ప్రతిప్రేమను (Reciprocity) మేము ఉర్దూవారినుండి అభిలషించుచున్నాము. వారినొకప్రశ్న అడుగుచున్నాము. ఇంగ్లీషుకన్న మా తెనుగు మరాటీ కన్నడభాషలు మీకు సన్నిహితమైనవా కావా? సన్నిహితమైనవైతే హైదరాబాదు విద్యావిధానములో ఇంగ్లీషుకున్న స్థానమైనాముల్కీభాషలకుండవలెనంటారా లేదంటారా? ఉర్దూ మాతృభాషకలవారు మూడుముల్కీభాషలను ద్వేషించుచున్నారా ప్రేమించుచున్నారా? ప్రేమించినవారగుచో గానికేమిగురుతు? వారేమైనా ఒక ముల్కీభాషను నేర్చుచున్నారా? తుదకు ముల్కీభాషలవారు ఉర్దూను నేర్చుకొన్నదానిలో సగమయినను నేర్చుకొనుచున్నారా? కాంగ్రెసువారిచ్ఛ్యలో నిర్బంధములేదు. వారుభాషను ఐచ్ఛికముగాచేసినారు. మూడుముల్కీభాషలవారు కలసినప్పుడు పరస్పరం మాట్లాడుకొనుటలో తప్పకుండా ఉర్దూసహాయము పొందవలెనని మేము వాదించుచున్నాము. దానికితగిన వాతావరణమును కల్పించుట ఉర్దూవారివిధి. ఉర్దూనుకఠినముగా చేయకుండా "బేసిక్" పద్ధతిపైన సులభభాషగా చేయవలెను. ఉర్దూవారికి ముల్కీభాషలపైప్రేమఉంటే వారు ఈదేశములోని వ్యవహారమందుండు పదాలను ఉర్దూలో నికితీసుకొనుటకు మారుగా అరేబియా, పర్షియావంటి విదేశభాషలలోని పదాలను అదేపనిగా పదపదానికి [illegible]అణాలు ఖర్చుచేసి ఉర్దూవాఙ్మయములో సృష్టించుటయేల? ఇంతదూరముచెప్పుటయేలనగా ఉర్దూముల్కీభాషల సామరస్యానికి ఏకొద్దిపాటి ప్రతిబంధకమున్నదోయేమోకాని వీటిలోపరస్పర ప్రేమను బాగాకలిగించుట చాలాసులభము. మనము మతదృష్టితో భాషాసమస్యను పరిష్కరింపగూడదు. మతదృష్టితోచూచినను భాష మతాలకు అడ్డురానేరదని క్రైస్తవమతచరిత్రను చూచిన మనకు స్పష్టముకాగలదు. ఈకారణాలచేత ముల్కీభాషలవారు ఉర్దూను ఏలద్వేషించుచున్నారని ఎవ్వరైనాప్రశ్నించిన అది తప్పుడు ప్రశ్న. నిరాధారమైన ఆరోపణముఅని చెప్పుచున్నాము, ఉర్దూనుమేము చదువము, మేముదానినికోరముఅని యెవ్వరన్నారు? ముల్కీ భాషలకు తగినప్రోత్సాహము మొదటఇయ్యవలెను. ఉర్దూను ఉన్నత తరగతులలోనిర్బంధద్వితీయభాషగాచేసిన ఆక్షేపణముండదు. అదేవిధముగా ఉర్దూబాలురకు జిల్లాప్రధానభాషను నిర్బంధ ద్వితీయభాషగా ఎందుకుచేయరాదు? అట్లయినచో ఒకరినొకరు బాగాఅర్థము చేసుకొనగలరు. వైషమ్యములుఉత్పత్తికానేరవు. పరభాషలనునేర్పుటకన్న పొరుగుభాషను కొంతవరకైనా నేర్పరాదా? "జబాందానీ" (భాషాపరిచయము) అనుపేరుతో అధికారులగు వారికొకముల్కీభాషలో కడతేరుటను నిర్బంధించినాము కదాఅనియందురా? అట్టికడతేరిన ఉర్దూమాతృభాషకల అధికారులను మరలసరియైన ముల్కీభాషాపండితులచే పరీక్షచేయించుడు. వారి "జబాందానీ" బయటపడును. మరియు ముల్కీభాషలవారికి అట్టి "జబాందానీ" పరీక్షఉర్దూలో తీసుకొంటే చాలదా? చాలకుంటే ఉర్దూనిర్బంధద్వితీయభాషతో మెట్రికులోకడతేరిన సనదుచాలునని నిర్ణయించితే అవసరము పూర్తియైపోగలదు. అయితే మేము ఉద్యోగులసంగతినిగురించి మాత్రమే చర్చించుటలేదు మేము విద్యనుగురించి యిప్పుడు చర్చించుచున్నాము.

ఇదిఉర్దూ ముల్కీభాషలస్థానములనుగూర్చినచర్చ. ఇక ముందు మనరాష్ట్రవిద్యావిధానములో ఇప్పుడు వర్తించుచున్న విధానమునుగురించి వ్రాయుచున్నాము.

---

## గ్రంథాలయమందలి సభలు

హైదరాబాదునగరమందలి శ్రీకృష్ణదేవరాయాంధ్ర గ్రంథాలయమువారు వార్షికోత్సవసందర్భములో మూడుదినాలు మంచిసేవ చేసినారు. "ఆంధ్రభోజనము" మంచిపద్ధతి-ఏడాదికొకమారైనా నగరాంధ్రవిద్యావంతులు సాంఘికసమావేశములోకలియుట మంచిదే-ఇదిప్రారంభము. ముందుకూడా దీనిసాగించి ఇంకా బాగా చేయగలరు-వార్షికోత్సవముతోపాటు కవిసమ్మేళనమును విడువకుండా జరుపుచున్నారు. ఈకవిసమ్మేళనసూచనను పెట్టకముందట మేమేచేసియుంటిమనునది చాలామందిమరచిపోయియుంటారు-ఇది చాలా మంచిపద్ధతి. ఇట్టి యుత్సాహపూరితమగు కార్యక్రమముల నతిశ్రద్ధతోనడుపుటకు కారకులు శ్రీ రావాడసత్యనారాయణగారు. వీరు ఈ రెండుసంవత్సరాల నుండి కార్యదర్శిగానుండి గ్రంథాలయాభివృద్ధికిని, తద్ద్వారాఆంధ్రులవిజ్ఞానాభ్యుదయములకొఱకును నిస్వార్థులయి పాటుపడినారు-ఇట్టిశ్రద్ధాభినివేశములతో పాటుపడిన శ్రీ సత్యనారాయణగారిని మేముమనసార అభినందించుచున్నాము.

అంతాబాగున్నదికాని ఒకలోపముమాత్రము కనబడుచున్నది- సభకు రాదగినంతమంది వచ్చుటలేదు-రెడ్డిహాస్టలువారలురచ్చటకొనరారు-మున్నూరు యువకజనులులేరు. [illegible] అసక్కడ వను. [illegible] దేవూడదర్వాజావారు కొనరారు-నగరమునకు [illegible] వీరందరు గుతమకమనసంఘాలయొక్కయు, సులాలయొక్కయు సభలలో బాగాకొనవచ్చురు-కానియిట్టి ఆంధ్రసభలలో శ్రద్ధతీసుకొనరు- పలువురు [illegible] సంకులు, ఆంధ్రవకీళ్లు, ఆంధ్రసేఠులు, సభలలో కానరారు-వారికితీరనిపనులుండవచ్చును-నిజాంరాష్ట్రాంధ్రులు తమసభ్యతను వదలుకొనలేరు-పీడలైనతీరరకు సభలకు అవకాశముకల్పించుకొని ఇర్చవలెను. బయటినుండి పండితులు వచ్చినప్పుడుకూడా వారిపత్రికముఖలాభాన్నివిని విజ్ఞానము సంపాదించుకొనజాలకుండిన యెట్లు! ఆలోచనీయస్థితి ఎప్పుడుమారునో యేమో? సకలాంధ్రసభలలో పాల్గొని విజ్ఞానసంపాదించుటలో చేరనివారు [illegible] సేవచేయజాలరు.

---

## హైదరాబాదు ధరలు

తేది ౧౫-౨-౫౧ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లచొప్పున ధరలన్నీ ఖాలిశ.

| దినుసు | పల్లా ౧కి ధర (రూ అ పై) |
|---|---|
| తెచిడిసాంబర్లు | ౨౪ నుండి ౨౫, ౨౬ |
| సంబర్లు | ౨౪ ౦ ౦ |
| ఫిర్లీబోగాలు | ౨౩ ౦ ౦ |
| రాంసాగర్లు | ౨౧ ౦ ౦ ౨౧౪ |
| బాసుక్రాం | ౨౨, ౨౩ కొత్తవి |
| ,, | ౨౩౪ ౨౪ పాతవి |
| ఆర్కాటి | ౧౧ ౦ ౦ ౨౧౪ కొత్తవి |
| ,, | ౨౨ ౦ ౦ పాతవి ౨౩ |
| కోనామణి | ౨౧ నుండి ౨౧౪వరకు |
| బియ్యములు | ౨౦ ౦ ౦ |
| దేశావరి | ౧౯, ౨౦, ౨౧ వరకు |
| **గోధుమలు** | |
| సర్బతి | ౨౨౪ ౨౧ |
| బన్సి | ౨౧ ౦ [illegible] |
| అష్కారి | ౨౦ ౦ ౨౧ |
| పోటియా | ౨౦ ౦ ౦ |
| ఎర్రగోధుమలు | ౧౯ ౧౯ ౦ |
| తెల్ల జొన్నలు | ౧౨, ౧౧ ౧౨ ౦ |
| పచ్చజొన్నలు | ౧౦ ౦ ౦ |
| సెనగలు | ౧౦౪ ౧౯ వరకు |
| కందులు తొబ్బరవి | ౧౧ ౦ |
| మినుములు | ౧౫ ౩ ౧౩౪౭ |
| అలసలు | ౧౫ ౦ ౦ |
| సజ్జలు | ౧౦ ౦ ౨, ౧౧ |
| **పప్పులు** | |
| సెనగ పప్పు | ౨౩ ౦ ౦ |
| కంది ,, | ౧౭ ౦ ౦ |
| పెసెసెనగ, | ౨౧ ౨౨ ౦ ౦ |
| లంక ,, | ౧౦ ౧ ౦ |
| మినప ,, | ౧౦ ౦ ౦ ౧౩౪ |
| పెసర ,, | ౧౯ ౦ ౦ |
| బెల్లము | ౧౩ నుండి ౧౫, ౧౪ ౧౯ ౦ |
| ఉప్పు | ౧౨, ౧౧ ౦ ౧ |
| వుల్లిగడ్డ | ౧౪ నుండి ౧౧౪ |
| పసుపు కొంచెది | ౪౫ వరకు కొత్తది |
| చక్కెర మణుము [౪౦ సేర్లు] | |
| జావా ,, ,, | ౧౪ ౦ ౦ |
| బొంబాయి ,, | ౧౩ ౧౪ ౦ |
| మద్రాసు ,, ,, | ౧౩ ౧౫ ౦ |
| నిజామాబాదు ,, ,, | ౧౩ ౧౨ ౦ |
| ఎర్రచక్కెర ,, పల్లా | ౧౩, నుండి ౧౫ వరకు |
| కర్రచక్కెర ,, ౪౦ సే. | ౧౭ ౧౨ ౦ |
| ఎల్లిగడ్డ మణుము ౧౨ సే. | ౫ ౦ ౦ |
| అల్లం ,, ,, | ౨ |
| మణుము ౧౨ సే. | |
| కొబ్బరనూనె ,, | ౫ ౧ ౦ |
| కుసుమనూనె ,, | ౫ ౦ ౦ |
| నువ్వులనూనె ,, | ౪ ౪ ౦ |
| వేరుసెనగనూనె ,, | ౪ ౦ ౦ |
| కిరోసిన (గ్యాస్) డబ్బా ౧కి | ౪-౧౨-౦ |
| నెయ్యి మణుము ౪౦ సేర్లు | |
| విదరు నెయ్యి ,, | ౭౫ ౦ ౦ |
| తెలంగాణా ,, | ౫౫ ౦ ౦ |
| [illegible] | ౧౧ ౭ ౦ |
| ఆముదాలు బస్తా | ౧౧ ౦ ౦ |
| వేరుసెనగ ,, | ౯ ౪ ౦ |
| పప్పు ,, | ౧౨ ౦ ౦ |
| బంగారు తులం ౧కి | ౫౨ ౦ ౦ |
| వెండి [illegible] | ౬౧ ౦ ౦ |
| ,, తు ౧కి | ౦౪ ౩ ౪ |
| [illegible] | ౩౩ ౧౨ ౦ |
| **మారకం** | |
| పాలిక కల్దార్లు | ౧౫ ౧౫ ౦ |
| కల్దారుకు పాలీకు | ౧౫ ౧౩ ౦ |

## బొంబాయి ధరలు

(నవంబరు ౧౭ వ తేదీన)

| | రూ. అ. పై. |
|---|---|
| బోచిపత్తి (ఏప్రిల్-మేవాయిదా కంట్రాక్టు) | ౨౩౫-౦-౦ |
| ఉమ్రాపత్తి (డిసెంబరు-జనవరి వాయిదా) | ౧౯౯-౦-౦ |
| ,, ,, (మార్చివాయిదా) | ౧౯౦-౦-౦ |
| (నవంబరు౧౩ తేదీన) | |
| వెండి (తయారు) తులాలు౧౦౦కి | ౭౩-౧-౦ |
| ,, (నవంబరు వాయిదా) తు.౧౦౦కి | ౭౨-౧౪-౦ |
| ,, (డిసెంబరు ,, ) ,, ,, | ౭౨-౧౩-౭ |
| బంగారు (తయారు) తులం౧కి | ౪౩-౧౨-౭ |
| ,, (నవంబరు వా॥) ,, ,, | ౪౩-౧౦-౭ |
| ,, (డిసంబరు ) ,, ,, | ౪౩-౧౧-౭ |

## ప్రభాకరరావుగారి బహిరంగలేఖకు సమాధానము

సదాశివపేట ఆర్యసమాజమువారు అస్పృశ్యతనుగురించి నన్ను ప్రశ్నించియుండుటచే వారికి సమాధానమిచ్చుట నా కర్తవ్యమై యుండెను. తాము మాధ్యస్థ్యము వహించి తద్విషయమున తీర్పు గావించ కోరికగలవారైయుండు రనిసంతోషమే కాని మీ బహిరంగలేఖను చదువుగా వాదికట్టునుండి న్యాయవాదియై యున్నారని తెలియుచున్నది, వ్యక్తిగతదూషణ భూషణములను వదలి సశాస్త్రీయము గాలిఖితరూపమున వాదింతు రనితమ ఛాలెంజి సంతోషపూర్వకముగా అంగీకరించుచున్నాను. "నేను ఆర్యసామాజికుడను కాకపోయినను" అనిస్వవిషయము వ్రాసుకొనియున్నారు. అయితే మీ రేసమాజమునకు చెందినవారో, మీసిద్ధాంతగ్రంథము లేవో, మీ జాతిమతాచారము లెట్టివో తెలియకయున్న మీతో వాదించుట నిరర్థకమే యగునని అనుకుంటాను.

మీరడిగిన ప్రశ్నల క్రింది సమాధానములు సంఖ్యాక్రమముగ సంక్షేపముగా వ్రాయుచున్నాను—

౧. నేనిచ్చు సమాధానములు ధార్మికములు. ధార్మికులందరు సమాధానము పొందియున్నారనుటకు దృష్టాంతము వారాక్షేపించక పోవుటయే

౨. నాది సనాతనమాధ్వ సాంప్రదాయము, శ్రుతిస్మృతిపురాణములు మాన గ్రంథములు, సనాతనధర్మవిరోధమైన భాష్యములన్నియు నొప్పుకొనుచున్నాను. ౩. వేదములను అపౌరుషేయ శ్రుతులని తలంచుచున్నాను, ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదములని వానినామములు బ్రాహ్మణములును, ఉపనిషత్తులును, పైవేదములందలి వేయవి నమ్ముచున్నాను ౪. పురాణములు పదియెనిమిది, ఉపపురాణములును, పదియెనిమిది. అనిమహత్పురాణమునందలి కొన్ని భాగములు మానవులకొరకు నిర్దేశించిచెప్పబడియున్నవి. బ్రహ్మ, పద్మ, విష్ణు, శివ, లింగ గరుడ, నారద, భాగవత, అగ్ని, స్కాంద, భవిష్య, బ్రహ్మవైవర్త, మార్కండేయ, వామన, వారాహ, మత్స్య, కూర్మ, బ్రహ్మాండ, ఇవి పురాణనామములు. సనత్కుమార, బృహన్నారదీయ, ఆదిత్య, మానవ, నందికేశ్వర, కూర్మ, భాగవత, వాశిష్ట, భార్గవ, ముద్గల, కల్కి, దేవి, మహాభాగవత, బృహద్ధర్మ, పరానంద, పశుపతి వహ్ని, హరివంశ, ఇవి ఉపపురాణములు. కర్తపేరటకొన్నిస్థలములందును విషయముల పేరట కొన్ని స్థలములందును ప్రాశ్నికుని పేరట కొన్నిస్థలములందును వేరువేరునామములచే పైపురాణములు పేర్కొనబడినవి. విస్తరభీతిచే తత్క్రమము తెలియజేయలేదు. ౫. పురాణములు భగవదుక్తులు. ప్రకటనకర్తలు వేదవ్యాసమహాపురుషులు, సృష్టిఆరంభసమయమే రచనాసమయము. ౬. ప్రశ్నలు— అధిక్షేపకములు, పూర్వపక్షములు, సంపూర్ణాసంపూర్ణమును పరికర్మమునుబట్టి నిర్ణయించుకొనవలయును— ౭ యుగమునకు ధర్మమునకు అవినాభావ సంబంధము. ఈయుగమునకు పరాశరాది స్మృతులు ప్రమాణములు. కలియుగ సమాప్తి ౪ లక్షల ౩౨వేల సంవత్సరములకగును. ౮. బహుసంఖ్యాకములు వానిబాహ్యచిహ్నములుగుడా బహుళములైయుండుటచే తెలుపవీలు గాదు. ఆయాసాంప్రదాయకులనడిగి తెలుసుకొనవలసినది ఇట్టిప్రశ్నలు వేయ్యగూడదు. మాబాహ్యచిహ్నములు ద్వాదశపుండ్రోర్ధ్వపుండ్రాదితప్తచక్రాద్యాధారణములు. ౯. సత్యార్థప్రకాశికను తెనుగు, హిందీలో చదివినాను, సంపూర్ణముగా పరమతనిరాకరణమువరకు ఒప్పుకొందును. ౧౦. ఆచార్యశబ్దమునకు అర్థము నన్ను "రాఘవేంద్రాచార్య" అనిపిలిచెడులోకుల నడుగవలసినది.

మహాశయా, మన ప్రాంతీయుల అంధకారపతిత్వమును నివారించుటకై తామీయుద్యోగమును చేయుచున్నచో చాలా సంతోషవిషయము. కాని మీకోటివిద్యార్థులు అనేకాచార్య సమ్మతమైన సనాతనధర్మమును నిర్మూలించ అపార్థములుకల్పించి వితండవాదమును చేయబూనరనియే నేను నమ్ముచున్నాను. ఉత్తరప్రత్యుత్తరములు విడివిడి అక్షరములతో యుండవలయును. తాముదేశముఖులగుటవలన ఉభయులకు వ్యయములు తామే భరించుకొనవలయును. అవిషయమైనాకు ముందే తెలుపవలయును, న్యాయశాస్త్రప్రకారముగా అతినిగ్రహస్థానములకులోబడకుండ సప్రమాణముగా సవిస్తరముగా వ్రాయవలయును— వ్యక్తిగతదూషణలుగాని ప్రకరణాంతరముగాని కొగూడదు. అస్పృశ్యత మహర్షిదయానంద సమ్మతమైనదా? కాదా? అనువిషయముపైననే యుండవలయును. దీనికిదయానందకృతగ్రంథములు మాత్రమే ప్రమాణములు అవియును ఆంధ్రభాషానువదితములైనవే యుండవలయును కారణమేమనగా తాము ప్రకటించు గ్రంథమాంధ్రమందుండునని తమలేఖవల్ల తెలియుచున్నది— తామిందుకేసమ్మతింతురని నమ్ముచున్నాను. తమఛాలెంజి సంతోషపూర్వకముగా అంగీకరించుచున్నాను. గోలకొండపత్రిక ద్వారా మీ జాతిమతసాంప్రదాయాచార్యయువాదివిషయములను బయలుపరచి ఉత్తరప్రత్యుత్తరములకు గడంగుడు అనివిన్నపము—

ఇట్లు,
లోకుర్తి రాఘవేంద్రాచార్యులు
పో. ము. తాలూకా కొడంగల్, జిల్లా గుల్బర్గా

ఈచర్చ ఇంతటితో పరిసమాప్తి. వీరుభయులు సభాముఖమునో, పరస్పరోత్తరప్రత్యుత్తరములద్వారానో వాదములను సాగించుకొని జయాపజయములను నిర్ణయించుకొందురుగాక!
(గో. ప. సం.)

## వెల్లుపల్లి గ్రామజనుల సమావేశము

[ఓ. వి.]

వెల్లుపల్లి గ్రామము సూర్యాపేట తాలూకా నల్లగొండజిల్లాలో చేరినట్టిది—౫౦౦ గృహసంఖ్యయు సుమారు మూడు వేల జనసంఖ్యయు గలదు— ౫— ౨—౧౩౫౧ ఫసలీనాడు తమ గ్రామములో సుమారు ౧౦౦ గురు గ్రామ ప్రజలు సమావేశమై సూర్యాపేట తాలూకా ఆంధ్రజనసంఘపు అర్గనైజరు ప్రోత్సాహమున ఒక గ్రామసంఘమును ఏర్పాటుచేసుకొని కార్యనిర్వాహకవర్గమును ఎన్నుకొనినారు,

ఎన్నికలతరువాత ఈ గ్రామప్రజలు, రైతులు, తమకున్న వ్యవసాయపు ఇబ్బందులను గూర్చియు ఈసంవత్సరము వర్షములు పడినందున పంటలు నశించుటచే మాల్గుజారీరకం మాఫీ కోరుచు, మాల్గుజారి శాఖాధికారికిని, అవ్వల్ తాలుకదారుగారికిని, తహశీలుదారుగారికిని, మహజరునామాలు వ్రాయించి సుమారు ౫౦ సంతకములుజేసి పంపుకొనినారు,

"గ్రంథాలయాభివృద్ధియే గ్రామాభివృద్ధియనియు తమగ్రామములో ప్రస్తుతము సుమారు ౩౦౦ పుస్తకములచే నడుపబడుచున్న గ్రంథాలయమునకు స్వగృహములేనందున ప్రజలందరకు అందుబాటులోలేక ఇబ్బందికల్గుచుండుటచే శాశ్వతముగ గ్రంథాలయమునకు భవనముకట్టించిఇచ్చెదమన్న శ్రీయుత పాటి రాంచంద్రారెడ్డి, శ్రీయుత పాటి వెంకటకృష్ణారెడ్డి. శ్రీయుత కొల్లూరు లక్ష్మీనరసయ్యగార్లతో గ్రంథాలయభవనము నిర్మింపజేయించుటకై ఈసభవారు తమ గ్రామసంఘకార్యవర్గమును కోరుచు తీర్మానించుచున్నారు."అను తీర్మానము ఆమోదించబడినది

## రాజకీయ ఖైదీల విడుదల

### గాంధిమహాత్ముడు కాంగ్రెసు వైఖరిని వివరించుట

సత్యాగ్రహ ఖైదీల విడుదల విషయమై కలిగిన సంచలనమునుగూర్చి నవంబరు ౧౩వ తేదిన గాంధిమహాత్ముడు వర్ధాగంజునుండి యొక ప్రకటన చేసిరి. అది ఈవిధముగా నున్నది:

"సత్యాగ్రహ ఖైదీల విముక్తికై యీమధ్య కొందరు ప్రభుత్వమును విసిగించుచున్నట్లు నాకు తెలిసినది. ఈవిషయమున ప్రభుత్వమే విధానము నవలంబించినను వానిదూషణ భూషణములతో గాని శ్లాఘా ప్రతిఘటనలతో గాని కాంగ్రెసునకే మాత్రము సంబంధము లేదు. విడుదల అయిన సత్యాగ్రహులు ఆరోగ్యవంతులు గానుండే తిరిగివారు సత్యాగ్రహంచేయవలెనని కోరబడుదురు, ఇదిని శ్చయము.

ఈసందర్భమున సత్యాగ్రహులకును, విచారణలేకయే బంధింపబడియున్నవారికిని మధ్యనెలకొన్న భేదమును కనుపరచినచో అదితప్పక అగ్రహకారణము కాగలదు. ఈవిషయమున ఏవిధముగ ప్రవర్తించిన న్యాయముగునను వంశమును ప్రభుత్వమునకువిడిచిపెట్టరాదు. అది ప్రజాభిప్రాయముచే నిర్ణయింపబడదగును. ఈవిషయమున ప్రజల యాశయమేమనగా ప్రభుత్వము తమయిచ్చచొప్పున సత్యాగ్రహులను బంధమునను౦చుకొనవచ్చును. బంధితులు నిరశనవ్రతంజరిపినను జరుపకున్నను అందరను ఒకేదృష్టితో చూడవలెను. ఖైదీలుచేసేభిన్న వ్రతాలు న్యాయవిరుద్ధములైనచో వాటిని ప్రభుత్వమువారు పాటింపనక్కరలేదు- ప్రస్తుతవిషయంలో దియోలీఖైదీల కోరికలలో వైరుధ్యమేమీలేదు- చిరకాలమునుండి దియోలీబందీలు తమబాధలను ప్రభుత్వముతో లగించగలదనే ఆశతో ఎదురు చూచుచుండుటచే వారికోరికలనుతీర్చి వారిపశ్చాత్తాపవాసములమాన్పు బాధ్యత ప్రభుత్వముపైనున్నది.

మూడవతరగతి రాజకీయ ఖైదీల ఆహారనైచ్యమునుగూర్చి వైద్యులును, ప్రముఖనాయకులున్ను యీమధ్య ముఖ్యముగ కొన్ని సూచనలను చేసియున్నారు- కనుక ఆసూచనలను ప్రభుత్వమువారంగీకరించి ఖైదీల ఆహారవిషయములో తగినమార్పులు జరుపవలెను. ఇంకా ఆన్యాయభూయిష్ఠములైన యితరలోపాలను కూడా బందీలకు తొలగించవలెను.

ప్రస్తుతము రాజకీయనిర్బంధితుల విముక్తికొరకై ప్రభుత్వముతో వ్యక్తులుసాగించుచున్న చర్చల సమయమున నేనుసూచించిన సంగతులనుగురించి బందీలకు సౌకర్యములుకలుగునట్లు ప్రయత్నింపవలెను- రాజకీయంగా గాని వేరొకవిధంగా గాని ప్రభుత్వమునకు క్లేశముకలుగకుండా యీకోరిక లనుతీర్చుట సాధ్యపడగలదు"

## దేవదాసుగాంధిగారికి శిక్ష

అలహాబాదు హైకోర్టులో కోర్టుధిక్కారపు నేరమునకై విచారింపబడుచున్న "హిందూస్థాన్ టైమ్సు" పత్రికాసంపాదకుడగు దేవదాసు గాంధిగారికి హైకోర్టువారు తుదినిర్ణయమున ౧౦౦౦ రూపాయిలుజుర్మానావిధించిరి, ఇదిచెల్లింపనిచో ౧ నెలవిడిఖైదు ఆపత్రికప్రచురణకర్తయగు దేవీప్రసాదుగారికి ౫౦౦ రూపాయిలు అపరాధము నువిధించిరి. చెల్లింపనిపక్షమున ౧నెలవిడిఖైదు- ఈపత్రికతాలూకు మీరటుపట్టపు విలేఖకులగు పింఘులుగారికి ౧నెలవిడిఖైదు మాత్రమువిధించినారు- పింఘులుగారికి ఖైదుకుబదులుగా జుర్మానా చెల్లించేఅవకాశంయివ్వనందున, తామున్ను డాఖైదుకేపోవుదుమని దేవదాసు గాంధిగారు జడ్జిలతో చెప్పిరి- జుర్మానాలు చెల్లింపడలచువారికి ౨వారాలగడువునిచ్చినారు. జడ్జిగారి తీర్పులో ప్రభుత్వన్యాయవాదికి దినమునకు ౧౦౦ రూపాయీలచొప్పున ఖర్చులుకూడా యివ్వమని చెప్పినారు -

## ఏడవ ఎడ్వర్డు బొమ్మకల రూపాయలు చెల్లవు

భారత దేశపుప్రభుత్వమువారు నవంబరు ౮ వ తేదిన గజటులో ఒక ప్రకటన చేసినారు-

"౩౧ మేనెల ౧౯౪౨ సం॥ తేదీకిపిదప ఏడవ ఎడ్వర్డుముద్రకలవెండిరూపాయిలు, అర్ధరూపాయిబిళ్లలు చెలామణి రద్దుచేయబడును. ఈ రూపాయలలో వెండియొక్కవగాఉండినందున యిట్టివానినన్నిటిని క్రమక్రమముగా అరవజార్జి ముద్రగలరూపాయిల సెక్కపచేయవలెనని భారతప్రభుత్వనిర్ణయము. అరవజార్జిబొమ్మతోఉన్న రూపాయిలలో నిక్కిలోహపదార్థము కలిసినది- వీటిబదులు క్రొత్తరకముగా నిర్మింపబడుచున్నందున పాంగరూపాయిలను ముద్రించుటయు దుర్ఘటమగును. ఈఎడ్వర్డుబొమ్మకల రూపాయిలను ౩౦ సెప్టెంబరు ౧౯౪౨ వరకు అన్ని ప్రభుత్వ కోశాగారములు, తపాలాశాఖలు, రైలుస్టేషనులలోను పుచ్చుకొందురు. అటుపిమ్మట మరల ప్రకటనజరుగువరకు వాటిని మద్రాసు, కలకత్తా, బొంబాయిరిజర్వుబ్యాంకులలో మాత్రమే పుచ్చుకొందురు" అని ప్రకటనలోకలదు.

## శాసనసభలలో పనికై ప్రచారము

### సత్యమూర్తిగారికి గాంధిమహాత్ముని అనుజ్ఞ

కాంగ్రెసువారు శాసనసభలలో చేరి పనిసాగించవలెనని తనఅభిప్రాయమును ప్రచారముచేయుటకై సత్యమూర్తిగారు గాంధిమహాత్ముని అనుజ్ఞకోరియుండిరి- అందుకు గాంధిమహాత్ముడు ఇట్లుసమాధానము ఇతరవిషయములతో కలిసి ఒకలేఖలో వ్రాసియుంచినారు-

"మీకుఅనుజ్ఞ అక్కరలేదు ...... కాంగ్రెసునియమావళిప్రకారము కాంగ్రెసువారలకు వాక్స్వాతంత్ర్యము కలదు......... మీరుఒక్కడినప్పటికిని నోరుకట్టిపెట్టవలెనని ఎవరునుమిమ్ముల నుకోరుటలేదు. మీరట్లుచేయుదురని అనుకొనుటయైనలేదు- ఆ నారోగ్యమువల్లనో, తదితరకారణమువల్లనో మీరుస్వయముగాపూనిన నిగ్రహముతప్పితే మీయిష్టము- కాంగ్రెసువారలు తమఅభిప్రాయములను ధారాళముగా అందరికిని తెలుపుచుండవలెననియే నాప్రకటనయొక్క అభిప్రాయము కాబట్టి, మీకిష్టమువచ్చినపుడు మీకిష్టమున్నరీతిగ మాట్లాడుటకు మీకుస్వాతంత్ర్యమున్నదనియే తలంచుడు- మీకేదో ఒకనియమము అటంకపడుచున్నదనియు, దానినితొలగించుట అవసరమనియు మీరుపొరపాటుగ అనుకొనుచుండుటవల్లనే మీకుచిక్కువచ్చినది"

# Golkonda Patrika

Volu 16 — No 55 | Published on every Monday and Thursday | Hyderabad Dn. | 20—11—1941


## స్థానిక వార్తలు

హైద్రాబాదు గోల్కొండసిగరెటు ఫ్యాక్టరీవారిపై ఇంకొకరు వ్యాజ్యము వేసియుండిరి. దానితో బ్రిటిషిండియాలో పెద్ద పెద్దవకీళ్లు వాదించిరి, తుదకుగోల్కొండ సిగరెటువారే గెలచిరి. హ-ఘ-వ-నిజాంగారును అతీర్పుపై సంతకము చేసిరి. ఈసందర్భముతో దానియజమానులైన సలీం ఖాతూన్ గారు తమ ఫ్యాక్టరీలోనిఅందరి యుద్యోగులకు నౌకరులకును ఒక నెలజీతము ఉచితంగా ఎక్కువగా ఇచ్చివేసిరి-

... ... ...

సర్ సికిందర్ గారు ఇటీవలచనిపోయిన సంబంధమున జగిరదార్ల గోరీవద్ద ఫాతెహా చదివిరి-

... ... ...

స్వామీ స్వతంత్రానందజీ ఆర్యసమాజ కార్యకర్తలవారు హైద్రాబాదునగరానికి ౨౦ నవంబరునాడు రానున్నారు-

... ... ...

మహమ్మదు అమీరలీఖాన్ గారు గుల్బర్గా తాలూక్కు సుబేదారుగా నియమింపబడినారు

... ... ...

ఔరంగాబాదులో మార్వాడీసభ కధ్యక్షతవహించిన లాలానారాయణలాల్ పిత్తీగారిట్లు ఉపన్యసించిరి- మనము హరిజనులను దూరముచేసినాము- దీనికైమనము సిగ్గుపడవలసియున్నది. మనలో బాల్యవివాహాలు వృద్ధవివాహాలుని ర్మూలంకావలెను. మనము వ్యాపారిజాతివారం. మనస్వదేశంవిడిచి అన్నిప్రాంతాలలో వ్యాపించుకొనిపోయి వ్యాపారములో వృద్ధిపొందినాము, ఇప్పుడు వడ్డీ తీరతమగ్గిట్టుకుంటా కాసనాలయినవి.మన పిల్లలవిద్యపరిశ్రమలలోనుండవలెను. పర్దామనజీ ఆచారముకాదు. దానిని వదలుకోవలెను.

... ... ...

సర్ సికిందర్ గారు హైద్రాబాదులోఫలక్నుమాబాగ్ అమా, మున్నగు ప్రదేశాలను తిలకించిరి. కలుకొవుల విందులంగీకరించి పాల్గొనిరి. అక్బరలీఖాన్ బ్యారిస్టరుగారిచ్చిన విందులో పాల్గొనిరి. అందుబ్యారిష్టరుమంత్రులు కొందరు హాజరైరి మూడవనాడు సర్ సికందర్ గారు హ-ఘ-వ నిజాం గారితో కలిసిమాట్లాడిరి-

... ... ...

ప్రభుత్వప్రకటనశాఖవారిట్లు తెలుపుచున్నారు-

భిక్షా నిషేధశాసనంఅయింది- దానిని కార్యరూపములో పెట్టుచున్నారు. అందుకుగాను గౌ॥ అల్లుద్దీజామంత్రిగారు కొందరిప్రజాప్రముఖులను పిలిపించిరి, అందుపై ఒకకమిటీఏర్పాటుచేసిరి. దానికి నవాబు హిమ్మత్ నవాజజంగుబ॥ గారి సహాకతములో ప్రతిజిల్లాలో ఒకజిల్లాకమిటీద్వారా యీ భిక్షానిరోధక్రియ జరిపింపబడును. బిచ్చగాండ్రకు విద్యచెప్పించుటకు వారినీతిని బాగుచేయుటకు పనిజరుగును, ప్రజలనుండి చందాలువసూలుచేయుటకు మునిసిపాలిటీవారును కొంతద్రవ్యమిత్తురు. ఇంతేకాని ప్రభుత్వమువారేమిన్ని ఇయ్యరు. పట్టిబిచ్చగాన్ని రెండేండ్లపాటు వృత్తివిద్య చెప్పించుస్కూలులో చేర్చుదురు. అట్లుచేరకుంటే వాన్ని అరెస్టుచేయుదురు. మొదలుఈపని హైద్రాబాదునగరములో ప్రారంభింతురు. తర్వాత క్రమక్రమంగా జిల్లాలలో ప్రవేశపెట్టుదురు-

... ... ...

నిజాంరైల్వే ఉద్యోగులజీతాలలో హెచ్చింపు చేయుచున్నారని వినవచ్చుచున్నది- ౩౫ నుండి ఒందరూ॥వరకు నెలజీతాలవారికి ౩-౮-౦ ఎక్కువయిత్తురట. ఇదేవిధముగా తక్కువజీతాలుపొందేవారి జీతాలలో హెచ్చింపుచేయుచున్నారట

... ... ...

నల్లగొండ తాలూకాకైన రాయిచెర్ల వాధ ప్రసాదుగారు మాల్గుజారీకచ్చేరీలో స్పెషల్ డ్యూటీపైన నియుక్తులైనారు-

... ... ...

సర్ మిర్జా ఇస్మాయిల్ (మైసూరుపాతదివానుగారు) హైద్రాబాదునగరానికి విచ్చేసినారు. వారు హ-ఘ-వ-నిజాంప్రభువుగారిని దర్శించుకొని చాలాసేపు సంభాషించినారు. గౌ॥ లెఫ్టినెంటుగారువారికివిందుచేసిరి-న॥బహాద్దరుయార్జంగు బ॥ గారికిని కొందరుసర్కారీ అధికారులకు మవారు దర్శనమిచ్చివారితో మాట్లాడినారు. మంగళవారమునాడు ఉస్మానియా విద్యాపీఠమును తిలకించి తమఆనందమును తెలిబుచ్చినారు. నగరములోని ముఖ్యస్థలాలను ఉస్మాన్ సాగరు మున్నగుచెరువులను తిలకించిరి- బుధవారము శ్రీ బిరారుయువరాజా గారిని సందర్శించుకొన్నారు- మరొకసారి హ-ఘ-వ- నిజాంప్రభువుగారిని దర్శించుకొని చాలాసేపుమాట్లాడినారు-

... ... ...

## వైస్రాయిగారితో మొర

హైద్రాబాదు హిందూ ప్రజామండలివారు హైద్రాబాదురాష్ట్రములో హిందువుల మాతృభాషలకు స్థానములేదనియు, ఉర్దూ నిర్బంధమున్నదనియును అది స్త్రీలకు నిర్దయమైనదనియు ఖాస్గీబళ్లగస్తీ రద్దుకాలేదనియు మాతృభాషల అనాదరమువల్ల హిందువుల సంస్కృతి విచ్ఛిన్నమగుచున్నదనియు ప్రైవేటు కళాశాలలకుగూడ సెలవియ్యకపోయిరనియు వైస్రాయి బహాద్దరు గారితో మొరపెట్టుకొనుచు బ్రిటిషిండియా విద్యాపీఠాలతో ప్రైవేటుకళాశాలలేర్పాటుచేసి అంటిపెట్టుకొనుటకై బ్రిటిషిండియా విద్యాపీఠశాసనములోనైనను మార్పుచేయవలసినదనియు మొరపెట్టుకున్నారు.

## కవిసమ్మేళనము

శ్రీకృష్ణదేవరాయల గ్రంథాలయములో ౧౭ తేదీనాడు మహాకవి చిఘకూలఅప్పయ్యశాస్త్రి గారి అధ్యక్షతలో కవిసమ్మేళనము జరిగెను. ఆంధ్రబాలికోన్నతపాఠశాలాబాలికయి ప్రార్థనాగానముతో సభ ప్రారంభమయ్యెను. తర్వాత అధ్యక్షులవారు కవితా ప్రాశస్త్యమునుగురించి విఫులమగు ఉపన్యాసమునిచ్చిరి తర్వాత వివిధ కవులు తమతమ రచనలలోని కొన్ని మచ్చుపద్యాలనుచదివి వినిపించిరి. ఇంచుమించు ౩౦ మంది కవులు అందు పాల్గొనిరి. వారిలో ౫-౬ మంది స్త్రీలు తమతమ కవితలను చదివిరి. వారందరును బాలికోన్నత పాఠశాలవారని తెలియవచ్చెను. ఈ౩౦ మందిలో చాలామంది కవిత్వమంచిదిగాను భావపూర్ణమును మంచిశైలిక లదియును నైయుండెను, అందు స్త్రీలందరును బాలికలే? పురుషులలో ఒకరిద్దరు బాలురునుండిరి. ఒక బాలుడు ౧౨ ఏండ్లవాడు వివేకవర్ధనిలో చదువువాడు మంచిపద్యాలు వ్రాసికొనివచ్చి చదివెను. భవనమంతయు సభ్యులచే నిండియుండెను. స్థలము చాలక చాలామంది బయటనిలిచియుండిరి. కవులలోను శ్రోతలలోను మంచి యుత్సాహము ఆనందము వినోదము వ్యాపించియుండెను.సభాంతమందు శ్రీయుత రావాడసత్యనారాయణగారు తమ కార్యదర్శికాలములోచేసిన చేయదలచిన విషయములను తెలుపుకొని సభ్యులు తమయందు చూపిన ఆదరణకు కృతజ్ఞతలర్పించుకొనిరి,తర్వాత బూర్గులరామకృష్ణారావుగారు శ్రీరావాడ సత్యనారాయణగారి ఉత్తమసేవను ప్రశంసించి వారి నిస్స్వార్థమైనత్యాగయుక్తమైన సారస్వత సేవను కొనియాడి సభ్యులందరిపక్షాన వారికి హృదయపూర్వకముగు కృతజ్ఞతలను తెలిపి పుష్పమాలాలంకృతులనుగా చేసిరి.

---

సాహుకారులసంఘమువారు హైదరాబాదు నగరములో సమావేశమై కొన్ని తీర్మానాలు చేసినారు- ఆదాయంపన్ను ఏర్పాటుచేయనందులకు ప్రభుత్వాన్ని మెచ్చుకొన్నారు- ట్రంకుటెలిఫోనుతో దరగా పెట్టిచండిఅన్నారు- ఒకవ్యాపారమాసపత్రికను స్థాపించవలెనని నిర్ణయించినారు- పరిశ్రమలమూలనిధిని పరిశ్రమలఅభివృద్ధికైఅందరికిని సమానసౌకర్యములు కలుగునట్లుగా ఏర్పాటుచేయవలెనని కోరినారు- హైదరాబాదు బ్యాంకు సంస్కరణములు అసంతృప్తికరముగా ఉన్నవని తమఅభిప్రాయమును తెలిబుచ్చినారు-

... ... ...

గుల్బర్గాలోను తత్పరిసరాలను న॥బహాద్దరుయార్జంగు॥బ గారు ముస్లిములలో ఉత్తేజముకలిగించుచు ప్రచారముచేయుచున్నారు. ముస్లింపరిశ్రమలను తనిఖీచేయుచున్నారు-

... ... ...

హైద్రాబాదునగరములో నిజామియాసదర్ యూనానీ వైద్యాలయములో జనానావార్డును కట్టుటకుప్రభుత్వంవారు ౧౭ వేలరూపాయిలు ఇచ్చినారు

... ... ...

హైదరాబాదు అకాడెమీవారు విద్యాసరమును కావించుసందర్భములో వారికి పోత్సాహముకలిగించుచు శ్రీబీరారు యువరాజుగారు సందేశమంపిరి. వారుదానికి పోషకత్వము వహించుట కంగీకరించిరి-

... ... ...

డాక్టర్ సర్ జియాఉద్దీన్ అహ్మదుగారు హైద్రాబాదునుండి తిరిగిపోయిరి. సర్ సికిందర్ హయాత్ ఖాన్ గారును హైద్రాబాదునుండివెళ్ళిరి

... ... ...

ఇటీవరలో గుల్బర్గా సుబేదారుగానుండిన న॥ గౌసుయార్జంగుబ॥గారు పెనషనుపొందు మాన్యుడినారు-

## శ్రీకృష్ణ దేవరాయల భాషానిలయము

హైద్రాబాదునగరములోని పై నిలయములో ఈనవంబరు ౧౭వ-తేది సోమవారమునాడు పిఠాపురముపండితులగు వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు శ్రీప్రతాపరెడ్డిగారును ఉపన్యసించిరి. శ్రీతాటికొండ అనంతరెడ్డి బి-ఏ-ఎల్-ఎల్-బి-గారు అధ్యక్షతవహించిరి. ఉపన్యాసకులు తమ ఆంధ్రభాషాభిమానమునుప్రకటించి గ్రంథాలయముయొక్క అభివృద్ధికై అందరుతోడ్పడవలెనని అభిప్రాయమిచ్చిరి. శ్రీఅధ్యక్షులగు అనంతారెడ్డిగారు గ్రంథాలయానికి రాజపోషకులగుటకు సమ్మతించి అనుగ్రహించిరి.

తర్వాత శ్రీరాజాబహద్దరుగారిఅధ్యక్షతలో ఎన్నికలుజరిగెను. శ్రీరావాడ సత్యనారాయణగారు కార్యనివేదికచదివి వినిపించిరి. తర్వాత కొత్తఎన్నికలు జరిగెను. శ్రీబిదురువెంకటశేషయ్యగారు కార్యదర్శిగను అధ్యక్షులు శ్రీ రాజబహద్దరు వెంకటరామారెడ్డిగారున్ను ఉపాధ్యక్షులు ఆకె జానకిరామారావుగారు శ్రీ ఇ. సీతారామరావుగారును సహాయకార్యదర్శి ఖండవల్లి బాలేందుశేఖరంగారును ఎన్నుకొనబడిరి.

కార్యదర్శిగారు చదివిన నివేదికలో ఈక్రింది విషయములు ముఖ్యమైనవి.

"శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము గ్రంథాలయ పఠనమందిరముల బాధ్యతనేగాక వీలుకొలది ఆంధ్రుల సర్వతోభివృద్ధికి తోడ్పడు ఇతరకార్యములనుకూడ నిర్వహించుచున్నది.నివేదికసంవత్సరమునజరిగిన ఉగాదిసమావేశము, కవీశ్వరుల వర్ధంతులు శ్రీఅడవిబాపిరాజుగారిచ్చిన "లలితకళలు"అను ఉపన్యాసము శ్రీవిద్వాన్ చిలకపూడి వెంకటేశ్వరశర్మగారిచే జరిపించిన సంగీతసభ, శ్రీద్వారము వెంకటస్వామినాయుడుగారికి జరిపినసన్మానము, వేదప్రాశస్త్యము మంత్రశాస్త్రమహిమ ప్రాచీనవిజ్ఞానరక్షణ అను విషయములపై జరిగిన ఉపన్యాసములు ఇందుకు తార్కాణము.

ఇప్పుడున్న సభ్యులసంఖ్య ౨౯౩- వీరిలో ౨౬౧ మంది సభ్యులును 32 మంది సభ్యరాండ్రును కలరు. ౩౫ లక్షలు ఆంధ్రులుగల నిజాంరాష్ట్రముకెల్ల కేంద్రగ్రంథాలయమని బరగుచున్న ఈగ్రంథాలయమున సభ్యులసంఖ్య గమనించిన విచారము కలుగుచున్నది.

సంవత్సరాంతమున మన గ్రంథాలయమున మొత్తము గ్రంథములసంఖ్య ౪౨౯౯- ఏబదేసి రూప్యముల విలువగల పెద్దబీరువాలు రెండు నిలయావసరములను గుర్తించి ఒక మహాశయుడు నిలయ కార్యదర్శిద్వారా గుప్తదానముగాచేయించిఇచ్చిరి వారే అరువది రూప్యములు విలువగల ఇంకొక పెద్దబీరువానుచేయించి శ్రీలక్ష్మణరాయ పరిశోధకమండలికి అనుబంధగ్రంథ భాండారము శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమున నున్నంతకాలము వాడుకొనుటకు కార్యదర్శి ద్వారానే అందచేసిరి

భాషానిలయమునకు పఠనమందిరమొక ముఖ్యాంగము. ఇందుసభ్యులు సభ్యులుకానివారు అను భేదముపాటింపబడక అందరును ఉచితముగా పత్రికలు, పుస్తకములు చదువుకొనుటకవకాశముగలదు. ఇది ప్రొద్దున గం. 8 నుండి గం. ౧౧ వరకు సాయంకాలము గం. 3 నుండి గం. ౮-౩౦ వరకును తెరచియుంచ దును వివిధములగు పత్రికలు సంచికలు ఇందు పాఠకులకు అందజేయబడుచున్నవి.

ఆదాయము మొత్తము రూ౧౭౧౦-౫-౪ మొత్తము వ్యయము రూ౧౬౭౭-౧౦-3

ముఖ్యమగు ఇట్టిసంస్థకు నేడు మూలధనము సున్న కావున- భాషానిలయము ఇతోధిక సేవ చేయవలెనన్న ఆంధ్రులెల్లరుపనిబూని మూలధనము చేకూర్పవలెను, ముఖ్యముగా ఆంధ్రసంస్థానాధీశులను శ్రీమంతులను పెద్ద ఉద్యోగులగు ఆంధ్రులను మేమిందులకై యభ్యర్థించుచున్నాము.

నిలయస్థాపకులలో ముఖ్యులును, నిలయమునకు 35 సంవత్సరములకుపైగ అధ్యక్షులుగనున్నవారును అగు శ్రీరాజానాయని వెంకటరంగారావు బహద్దురుగారు తమ అధ్యక్షపదవినుండి విరమించుకొనినారు వారునిలయమునకు చేసినసేవఅపారము. ఇకముందును యథాపూర్వకముగ నిలయమునెడలసానుభూతిని గని తోడ్పడుచుందురనియు తామీపదవినుండి విశ్రాంతిని కోరుచున్నామనియు నచ్చజెప్పినమీదట వారిస్థానే శ్రీరాజాబహద్దరు వెంకటరామారెడ్డి ఓ-బి-ఇ-గారు అధ్యక్షులుగా ఎన్నుకొనబడినారు. శ్రీరాజాబహద్దరుగారు హైద్రాబాదులోని ఆంధ్రసంస్థలన్నింటికి కల్పవృక్షము వంటివారు. వీరి అధ్యక్షపదవికాలమున ఇతోధికముగా వృద్ధిచెందునని మావిశ్వాసము. నిలయమందిరము 20 సంవత్సరములక్రింద నిర్మింపబడినది. అప్పటి అవసరముకది చాలియుండినను నేటి కార్యక్రమములకు భవనము చాలుటలేదు. నిలయభవనమును విస్తృతముచేయుటయో, లేక క్రొత్తగ మరొకభవనమును సమకూర్చుకొనుటయో జరిగినగాని నిలయావసరములు పూర్తియగుటకష్టము, దీనికి ధనసహాయము మత్యవసరము. మందిర నిర్మాణనిధిని ఏర్పరచి తగుప్రయత్నముచేయుటకు కార్యనిర్వాహకులు నిశ్చయించినారు. ఆంధ్రులందరు ఉదారపూర్వకముగ సహాయము చేయుదురని ఆశించుచున్నాను."

రావాడ సత్యనారాయణ
గౌరవకార్యదర్శి,

## ఇండియా సరిహద్దున దౌర్జన్యప్రతిఘటన

ఇండియాన్ వాయవ్యపు సరిహద్దున పెషావరుయందు సరిహద్దు కావలనుండుతెగలవారు ఇటీవల అసాధారణమైన దౌర్జన్యమును చేసినారు, అందులో నిరపరాధులనేకుల ప్రాణాలు తీయబడినవి, కాని తుదకు సరిహద్దు పోలీసులును ఆగ్రామముల పార్టీలవారలు కలిసి మంచి ప్రతిక్రియచేసి ప్రాణాపాయములను విడిపించగలిగినారు ఈశిక్ష ఆదుర్జనులకు బుద్ధితెగలదని నమ్ముచున్నామనుచు ఇండియా ప్రభుత్వమువారు సరిహద్దు రాష్ట్రప్రభుత్వమునకు నవంబరు ౧౧వ తేదిన తంతిసందేశములో అభినందనమంపినారు. గ్రామజనుల సహకారమువల్లనే విజయముకలిగినదని సంతోషించినారు.




Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A. B. L.